# కావ్యావళి

శ్రీ శివశంకర శాస్త్రి

ప్రథమ భాగము

ప్రాప్తి స్థానములు : సాహితీ సమితి.
ఆంధ్ర సాహిత్య పరిషత్తు, గుంటూరు

అ ం కి త ము

శ్రీ ఆమంచర్ల
శేషా చలపతి రావుకు

# ధనుర్దాసు

దేవా, మేదురతావకీనకరుణాదీవ్యత్కటాక్షప్రభా
శ్రీవిద్యోతితుడౌచు భాగ్యమును గాంచెన్ దాసు డీప్రొద్దునన్
కావేరీపరిపూతశీతలమహాకల్లోలినీస్పర్శతో
భావంతం బయి పొల్చు నీపరధరాభాగంబుచందంబునన్.

ఈనాడే నొనరించి నట్టిసుకృతం బెంతో యహీనంబు కా
దేనిన్ యుష్మదపాంగవీక్షణమహ స్సేలా ప్రవర్తిల్లు నీ
దీనాంఘ్రిప్రభవాధమాధమునిపై దేవా, కృపాపూర్ణమై?
ఆనందోద్గతి బిచ్చలించినది రోమాంచంబు దేహంబునన్ !

మీసందర్శననవ్యభాగ్యమున స్వామీ, ధన్యతం గాంచితిన్
వాసిం బొందెను నిశ్చయంబుగ భవద్వాల్లభ్యసంలబ్ధి నీ
దాసుం! డానిఖిలైకనాయకుని సందర్శించిన ట్లయ్యె మీ
శ్రీసాన్నిధ్యమునందు నిల్వగనె యక్షీణప్రమోదంబునన్ !

స్వామీ, తావకపాదపంకజరజస్సంసక్తిచే నొప్పెడున్
నామూర్ధం బుదయార్కమండలదళన్నవ్యప్రభారంజిత
శ్రీమంతం బగునంజనాచలగతిన్. సేవాసమారాధనో
ద్దామప్రౌఢిమ నాకు లభ్య మవుతన్ ద్వత్సన్నిధానంబునన్ !

ఈదాసాధముమీఁద నేల పడెనో యీనాడు జ్ఞానప్రభా
శ్రీదం బైనభవత్కటాక్షము కృపాసింధూ, వచింపంగదే!
మోదస్ఫూర్తి సమాచరించు భ్రుకుటిలో మూర్ధంబుపై నిల్పి త్వ
త్పాదాంభోజముల న్నియోగముల నీదాసానుదాసుం డిదే!

## భగవద్రామానుజులు

కనుఁగొన నిన్ను సంతసము కల్గిన దెంతయు నేఁడు మాకు, నీ
వినయ మకృత్రిమోద్గతిని వెల్లడి యయ్యెను, భక్తిభావమో
ఘనమధురప్రకారమున గానగ వచ్చెను, నీపవిత్రసం
బనుపమభంగి నొప్పెను మదాశిషముం గొనుమోకుమారకా!

జననము శూద్రవంశమున సంఘటిలంగనె లోప మేమి? ఆ
ననమున సౌమ్యదీధితి కనంబడుచున్నది, భాషణంబులం
దొనరె నకల్మషారభటి, యోగ్యత యున్నది పెక్కురీతులన్,
ఘన మగులోప మొక్కటియె కానగవచ్చెను మాకు నీకడన్.

నది నవగాహనాదిక మొనర్చి మఠాగమనాభిలాష నీ
యుదయమునందు మేము చనుచుండెడివేళను శిష్యపంక్తితో,
ఎదురుగ వచ్చినావు మదిరేక్షణ కొక్కతె కాతపత్రముం
బదిలముగా ధరించి యిరుపార్శ్వములం జనుచుం స్ఖలద్గతిన్.

తరుణివిలోచనద్వయిని దప్పక నిల్పితి వీక్షణంబులన్,
సరసనె పోవువారలదెసం గనుగొవ్వు, లవంబుసైత మే
నరసినయట్లు లేదు పథమందలి వింతలనైన, కామినీ
పరవశబుద్ధితో జనెడిభంగి గనంబడినావు దాసుడా!

పాలతుకమీఁద నీకు బరిపూర్ణముగా ననురాగ ముండనీ—
చెలియకు దద్విధంబున నశేషజనంబుల మ్రోల సేవలం
జలుపుచు, లజ్జ బోవిడిచి సంచరిలం దగునయ్య? ప్రేముడిన్
నిలుపఁగఁబోలు రమ్యముగ నిండుమనమ్మున గూఢవృత్తితో.

## ధ ను ర్దా సు

స్వామి, భవత్పదద్వయము సాక్షిగ బల్కెద విశ్వసింపుఁడీ !
భామినిమీఁదిమత్ప్రణయభావము వెల్లడిసేయు బుద్ధి నా
కేమియు లేదు, లజ్జ త్యజియించెడికోరిక లేదు, ధూర్తతం
గామినికిన్ సపర్యలను గా దొనరించుట దేశికాగ్రణీ !

కావరబుద్ధి గాదు పథగాముల జూడక యుంట, వింతలో
యేవియు బట్ట, వాకువలయేక్షణదివ్యవిలోచనద్యుతి
శ్రీ వసివాడు భాస్కరరుచిప్రసరంబున నన్నభీతి నో
దేవర, యామెనుండి నిజదృష్టి మరల్పఁగ నైతి నయ్యెడన్.

ఆమెను జెప్పుపట్ల మదిరాక్షి యటంచు వచించినార లో
స్వామి, విధేయదాసజనుసాహసమున్ క్షమియింపఁగా వలెన్ !
ఆమహిళాలలామవిపులాయతనేత్రము లుత్పలప్రభా
ధామము గాక వేరొకవిధంబుగ దోచునె నాకు దేశికా !

మానసహారులై మధురమంజులనూతనకాంతి నొప్పి ల
క్ష్మీనిలయంబులై వెలయు చిత్రగతిం బ్రియురాలినేత్రముల్.
పూనుట దుర్భరం బగు ప్రభూ, తమదాసుడు మేన ప్రాణముల్
మ్లానము లయ్యెనేని యణుమాత్రము తన్నయనోత్పలచ్ఛవుల్!

భగవద్రామానుజులు

తెలియగవచ్చె మాకు భవదీయవిధం బిపుడంతయున్ సుతా!
చెలియవిలోచనద్వయికి జేయుచునుంటివి సేవ—మంచిదే.
కలికిమనోజ్ఞనేత్రములకన్న మనోజ్ఞమవై మహోద్యుతుల్
గొలిపెడి నేత్రయుగ్మమునకున్ నిరతంబు సపర్య సేయుదే?

ధనుర్దాసు

ఎక్కడఁగూడ నాకువలయేక్షణకన్నులకాంతికన్న సొం
పెక్కినయంబకద్యుతుల నెన్నఁడు జూడగలేదు! మిక్కిలిం
జొక్కపునేత్రయుగ్మమును జూపుదు రేని మహానుభావ, నే
నిక్కపుభక్తిభావమున నిత్యము దాస్యము చేయకుందునే?

భగవద్రామానుజులు

ఆనందంబు ఘటిల్లె మాకిపుడు వత్సా, నీవచోధోరణిన్!
నీనిష్కల్మషవృత్తి శిష్యహృదయోన్మేషం బొనర్చెం గదా!
కానం బోవుద మెల్లరుం గదలుడీ, కల్యాణికాంతిచ్ఛటా
స్థానంబై విలసిల్లు దివ్యనయనద్వంద్వంబు, శీఘ్రంబుగన్!

౨

భగవద్రామానుజులు

పరమాకారణజాయమానకరుణాపాంగప్రసారంబునన్—
భరితాజ్ఞానదురంతసంతమసమున్ భంజించుచున్, విష్టప

స్థిరసంరక్షణభార మూనిన మహా శ్రీరంగనాథా, భవ
చ్చరణాబ్జంబుల కే నొనర్చెద నమస్కారంబు భక్తప్రియా!

అవలోకింపుము వత్స, అల్లవె రమాహ్లాదాను సంధానవై
భవముల్, దిక్కృతభానుమండలరుచుల్, బ్రహ్మాండసందీపక
చ్ఛవులున్, భక్తిభరప్రపన్నజనతా సంరక్షణప్రాభవో
త్సవముల్, రంగశయానదివ్యకరుణాసంఫుల్లనేత్రాబ్జముల్!

ధనుర్దాసు

అహహా, యెంతమనోహరంబులు త్వదీయప్రస్ఫురన్నేత్రముల్!
మిహిరప్రస్ఫుట చండమండల సమున్మేషప్రభల్ కల్గియుం
దుహినాంశుద్యుతి శీతలమ్ము లయిసంతోషం బొసంగెః భవ
న్మహిమం బొప్పు మహాద్భుతమ్ముగనుశ్రీమద్రంగధామప్రభూ!

అవలోకింపగనైతి నేటివర కాహా దుర్విపాకంబునన్
భువనత్రాణన భూరిశీతలకృపాపూర్ణప్రభావస్ఫుర
ద్భవదక్షిద్వితయంబు! దేశికదయాప్రస్యంది వాఙ్మాధురిన్
నవసౌభాగ్యము కల్గె నక్కజముగా నాకో జగన్నాయకా!

స్థిరతాత్పర్యముతోడ కన్గొనినచో దేవా, భవన్నేత్రముల్,
తిరుగన్నేర్చునె బుద్ధి యన్యనయనో ద్రిక్తప్రమోదంబునన్?
పరమప్రీతిని భృంగ మాసవసుధాపానాభిలాషన్ దళ
త్సరసీజంబుల వాలు గాని యితరత్పూజంబులం జేరునే!

# శిష్యరాలు

## ౧

### శిష్యుడు

ఆలయములోని కతిపలయాగమనము
సమ్మతింపరు రూపగోస్వామి వారు.
వారియానతి జవదాట వలను పడదు;
లేదు నాలోప మిందు తల్లీ, క్షమించు!

### మీరాబాయి

ఆడువారలు కృష్ణదేవుని
జూడ గూడదొ? యెచటనే నీ
జాడ గానగ లేదు, మీకడ
నేడు కనుగొంటిన్.

కరుణ యుంచుక పూని నాపై
మరల వారికి విన్నవింపుము
చరణసేవ యొనర్పకుండగ
మరలి పోజాలన్.

## శి ష్యు డు

నీ ముఖాబ్జవిలోకన నిమిషమందె
పొడమె తల్లి, నమస్కారబుద్ధి నాకు.
తోచినది కూడ నీముఖద్యుతులవలన
అద్వితీయ మహాభక్తురాల వనుచు.

చండశాసను లస్మదాచార్యు లమ్మ!
కామినీ కాంచనంబులు కంట బడిన
తొలగి పోవని చో మోక్షదూరు లగుదు
రెల్ల పూరుషు లని సెల విచ్చినారు.

జనని, గ్రహియించి యస్మదాచార్యదేవు
శ్రీముఖోద్గతవాక్యంబు స్థిరమటంచు
తరలి వేంచేయు మింకొక తావునకును.
స్వీకరింపుము మన్నమస్కృతిని దయను!

## మీ రా బా యి

విన్నవింపుము స్వామివారికి
మన్నమస్కృతి పూర్వకంబుగ
చిన్ని నావిజ్ఞాపనం బో
యన్న యీరీతిన్ :

భరతవర్షవిభూషణం బై
వరలు బృందావన క్షేత్రము!

నరసిజాక్షుడె నాతలంపున
పురుషుఁ డిచ్చోటఁగా.

పెక్కు రున్నా రితరు లిక్కడ
నిక్కువంబే, కాని యందరు
మిక్కుటం బగు కృష్ణురక్తిని
జొక్కి యుండుటచే——

చెల్ల దేమియు భిన్నభావం
బెల్లరును గోపాలుమృదుపద
పల్లవద్వయసేవ సల్పెడి
వలవాంగనలే !

శిష్యుడు

నీపవిత్రజిహ్వాగ్రవినిర్గత మగు
భాషిత సుధారసార్ద్ర సంస్పర్శనమున
మార్జితం బయ్యె నజ్ఞాత మలినవృత్తి !
స్వామికడ విన్నవింతు నీవాక్యసరణి.

౨

శ్రీ రూప గోస్వామి

బిడ్డ, నిన్ను జూడ ప్రీతి కల్గెను నాకు.
అధివసింపు మిదె కుశాసనంబు.
శుద్ధమానసంబు సూచించుచున్నది
నిర్మలాభ వెల్గు నీముఖంబు.

నీవు చెప్పి పంపు నిస్తులవాక్యమ్ము
లాలకింప నధికహర్ష మొదవె.
భక్తిభరిత మగును భవదీయహృదయంబు,
నీవు ధన్య వమ్మ, నిశ్చయముగ !

పురుషు లైన నేమి పూబోణులవిధాన
పంకజాతనయను పాదసన్ని
ధానమందు భక్తి దమయాత్మ లర్పింప
కుందు రేని ముక్తి యొదవు టెట్లు?

ఎచటినుండి బిడ్డ, యేతెంచుచున్నావు?
ఎచటి కేగు దాన విచటనుండి?
నామధేయ మేమి? నావల్ల నీ కేమి
ఫలము కలుగగలదొ తెలుపు మమ్మ !

## మీరాబాయి

స్వామి, వచ్చితి రాజపుత్రుల
భూమినుండి, పవిత్రబృందా
ధామమున నశ్రాంతవాసము
కామితము తండ్రీ !

దాసి మీరాబాయి : యిచ్చట
వాసమున కంగీకరింపుడు.
వాసరమ్ములు గడపుదానను
మీసపర్యలలో.

స్వామి, వీనుల గ్రోలుచును మీ
శ్రీముఖోద్గత దివ్యవాణిని
ఈమహా క్షేత్రమున కృష్ణ
ప్రేమ నివసింతున్.

## శ్రీ రూప గోస్వామి

నేడు సుదిన మమ్మ, నిన్ను గాంచుట జేసి!
భక్తజనములందు ప్రథిత వీవు.
సిద్ధురాలి కేను జెప్పెడి దేముండు?
నిలువవచ్చు నిచట నీవు తల్లి !

## మీరాబాయి

ధన్యురాలను దొరకె శ్రీ చై
తన్య దేవ మహాప్రభూత్తమ
మాన్యశిష్యుని పాదసేవన,
మన్య మింకేలా !

గురుచరణం మమ శరణమ్!

# ప్రభు తీర్థము

### శంకరుడు

మహిత వాసవమణికుట్టిమమ్ము బోలు
సాగరముతోడ నొప్పుభూసౌధమునకు
కౌముదీప్లావితం బైనగగనసీమ
తనరుచున్నది ధవళవితానకాంతి.

విమల మాసీవిభావరీసమయశోభ
నేలనో కాని కన్గొన నిచ్చగింప
కాననము వాలిచి నిమీలితాక్షు లగుచు
పలుకకున్నారు శ్రీ మహాప్రభువు వారు !

### రామానంద రాయలు

దేవ, ప్రసరింప జేయుడు దృష్టి ఇటులు
పొంగి పోవుచునున్నది పూర్ణచంద్రి
కిరణజాలమ్ము తాకున కెరలి మిగుల
ఆతతం బైనసీలరత్నాకరంబు—

రాధికాదేవి కబరీభరమ్మునుండి
జారుచుండెడి కుసుమసంస్పర్శవలన
పరమహర్షమ్ముతో గగుర్పాటు గాంచు
శ్యామసుందరు లలితదేహమ్మువోలె.

శ్రీ చైతన్య మహాప్రభువు

[కన్నులు తెరచి]

ఏడి నాశ్యామసుందరు డేడి యేడి !
చూచుచుండగ నెచటికో సురిగినాడు.
ఇచటనే నిల్చియున్నవా డింతలోనె
అచ్చెరువు తోప నేకడ కరిగినాడు !

ఏమి చిత్రము సఖులార ! ఇప్పుడె యతని
నీప్రదేశమ్మునందె వీక్షింపగంటి.
అంతలోనె యంతర్ధాన మయ్యె నయ్యొ
వంచకాగ్రణి గోపికావల్లభుండు !

[ఇటు నటు చూచి]

కాన రావేమి కృష్ణ, ఈకన్నుదోయి
ఏమి పాపమ్ము చేసినదో మనోజ్ఞ
దివ్యభవదీయ రూపదీధితి లభింప
దక్కటా!- రమ్ము నాహృదయాధినాథ!

నిన్ను గనజాలకున్న నే నిమిషమైన
తాళజాలను కృష్ణ, ఈతనువునుండి
ప్రాణములు లేచిపోవు! కృపాపరిపూర్ణ
మానసమ్మున దరి జేరుమా రయమ్ము!

వినయపూర్వకముగ నిన్ను వేడుచున్న
దోయి రాధిక! రమ్ము నేత్రోత్సవముగ.

[ కొంచె మూరమునుండి ]

శీఘ్రగతితోడ నేల వెంచేయ కుంటి
వోయి! అక్కట యేమి చేయుదును కృష్ణ!

ప్రాణసఖులార, భర్తగోపాలకుండు
అతిరయమ్మున నెచ్చటి కరిగినాడొ
తెలిసికొని సత్వరము నివేదింప రేని
ఇంక మీతోడ నెపుడు భాషింప నేను!

గోవింద దాసు

[ మహాప్రభుపాదముల మీద వ్రాలి ]

మీచరణదాసవర్గమ్ము మీద నిట్టు
లాగ్రహింపగ నేల మహానుభావ!
కింకర జనమ్ముపై మీరు కినుక పూని
పలుకకుండిన నెట్టులు బ్రదుకగలము!

రామానంద రాయలు

ప్రభువరున కాగ్రహము లేదు: భయము వీడి
లెమ్ము గోవింద, ఇయ్యది లీల సుమ్ము.
స్వామి యియ్యెడ తన్మయత్వమ్ము లోన
పల్కు శ్రీరాధికాదేవి భావనమున.

శ్రీ మహాప్రభువు

[ ప్రక్కకు చూచి ]

కేకిపింఛావతంసుడై కృష్ణు డదిగో
నన్ను గాంచి శిరః కంపనమ్ము చేసె!

[ ఉత్కంఠతో ]

ఇదిగో పరుగిడి వచ్చి నాహృదయనాథ,
చేరుదానను నీసమాశ్లేషమందు !

[ ముందరికి పోబోవును ]

శంకరుడు

మారుతాహతి నుత్కంపమానశిఖర
కలిత మైనట్టి తాళవృక్షమ్ము గాని
బర్హిబర్హావతంస గోపాలమూర్తి
కాదు కాదు మహాప్రభూ, కనుగొనుండు.

శ్రీ మహాప్రభువు

[చంద్రునివంక జూచి]

శ్యామసుందర, ఏమి యన్యాయ మోయి !
యోగ్యముగ లేదె నీకు నాయూరుతలము?
ప్రేయసిని రాధ నిట్లు పరిత్యజించి
పవ్వళించితి వేటికి పాలకడలి ?

శంకరుడు

కాదు కా దది క్షీరసాగరము కాదు,
పరిణతం బైనచంద్రబింబమ్ము కాని,
నడుమ నున్నది శ్యామసుందరుడు కాడు
సాంద్ర మైనట్టి మేదినీచ్ఛాయ కాని.

శ్రీ మహాప్రభువు

అయ్యయో, నా డెంత దయావిహీను
డో హిమాంశుడు ! గగనమునుండి యిట్లు
కౌముదీరూపకం బైనకారుచిచ్చు
నొక్కరీతి వర్షించుచున్నవాడు !

[రాధతో]

తాళజాలను కృష్ణ, యీతాపమునకు
దీనురాలిని మిగుల బాధింతు వేమి?

శీఘ్రముగ నేగుదెంచి యాశ్లేష మిచ్చి
అపనయింపుము దేహదాహమ్ము నాథ !

[జాలిగా]

ఎంత బ్రతిమాలుకొన్న రా వేమి కృష్ణ !
రాధ చేసిన ప్రబలాపరాధ మేమి !
ఎంత నీకయి నేను తపించుచున్న
పలుక వేటికి అయ్యయో ప్రాణనాథ!

అక్కటా, సత్వరంబ మీ రైన బయలు
వెడలి చెలులార, కృష్ణుని వెదకి తెండు
ప్రాణనాయకు గాఢబంధమందె
స్వస్థ నయ్యెద-అన్యత్ర శాంతి లేదు!

మిమ్మునైనను చెలులార, నమ్మరాదు.
కఠినహృదయలు! ఇకనైన కదల రేమి?
ప్రాణములు పోవుచిమ్మట పరుగువారి
తీసికొనివత్తు రొక్కొ ఆమోసగాని?

[రోషముతో]

పట్టువడునేని ధూర్తగోపాలు నిపుడు
నలిపివేయనె ఆలింగనమ్మునందు!

కఠిన దంతక్షతమ్ములు కఠిన నఖర
ఘాతములు చేయకుండునే గాత్రమందు!

[ కన్నులు మూసుకొని ]

ఆగ్రహింపకు మోయి యీయబలపైన!
బాధలో నాథ, ఏమేమొ పలికినాను.
కరుణ వహియించి వేగమ కౌగిలించి
అతితరం బైనతాపము నార్పు మోయి!

[ ముందరికి పడబోగా దాసులు పట్టుకొన్నారు ]

[ కనులు తెరచి ఆనందముతో ]

అదుగో నాశ్యామసుందరు డదుగొ అదుగొ
వచ్చుచున్నాడు నాప్రాణవల్లభుండు.
హస్తములు చాపి నీ ప్రియురాలి కృష్ణ,
చేర్చుకొమ్ము భుజాంతర సీమయందు!

[ తటాలున సముద్రమున పడినాడు ]

రామానంద రాయలు

[ కలవరముతో ]

వేగముగ పట్టుకొమ్ము గోవిందదాస!
శంకరా, లెమ్ము లేలెమ్ము సత్వరముగ.

పట్టు తప్పించుకొని మహాప్రబలధాటి
నురికినాడు మహాప్రభు వుదధిలోన.

శిష్యులు లేవదీయగా ఆనందముతో

శ్రీ మహాప్రభువు

ఎంత తాపాపనోదకం బెంత శీత
లమ్ము నాప్రాణనాయకు లలితగాత్ర,
మెంత మధురమ్ము నా హృదయేశు గాఢ
భంగురోరః స్థలీసమాలింగనమ్ము!

రామానంద రాయలు

పరివిమలం బైన శ్రీమహాప్రభువరేణ్యు
గాత్రసంస్పర్శచేత సాగరజలంబు
విమలమధురము పరమపవిత్ర మయ్యె!
ఈ ప్రదేశము తీర్థమూ నింకమీద.

గోవింద దాసు

[ సముద్రోదకము నోట బోసికొని ]

భక్తకల్పద్రుమం బైనప్రభుశరీర
మధురసంస్పర్శవశమున మారిపోయె
నహహా, స్వాభావికం బైనయబ్ధిగుణము;
ఇక్షుమధురమ్ముగా నున్న దిచటి నీరు!

శిష్యులు

[ ఉచ్చైఃస్వరముతో ]

జయము సద్గురు మాలికి జయము జయము
జయము జయము నవద్వీపచంద్రమునకు
జయము శ్రీగౌరగోవిందచక్రవర్తి!
కధికజయము మహాప్రభుననుచరులకు!

శ్రీ మహాప్రభు చరణయో రతి రస్తు!

# దీ పా రా ధ న

## కుంభమీాకు దుర్గము:

రఘూలా రాజ కుమారి

ఇటు సంఘటిల్లు నని యెంచనె లేదు, నే డీ
కుటిలాత్మకుండు నను కోటకు జేర్చె నయ్యో!
ఇటనుండి ముక్తి లభించుట యెట్లొ! న న్నో
నిటలాక్ష, వేగ కరుణింపు మనాథనాథా!

పరు లేవిధంబునను పాదము పెట్ట లే రీ
ధరణీధరాగ్ర రచితం బగుదుర్గ రేఖాం
తరసీమ! నా కిపుడు దారిని జూపగా నో
గిరిపుత్రికారమణ, కేవల మీావె దేవా!

హృదయేశు గూడి సుఖియించెద నంచు లోలో
ముద మొందుచుండ కను మూసెదునంతలో నీ
యదయుండు మాకు నకటా! యెడబాటు గూర్చెన్.
తుద కేమి కాగలదొ తోచుట లేదు దేవా!

భయ మెత్తుచున్నది! నృపాలుని యూహ మేమో!
వయ సెంతయో చనినవానికి కాంత యేలా!

నయవృత్తి బోవిడిచి, న న్నొకవేళ కేళీ
ప్రియుడై విలాసినిగ బెగ్గిలజేయు నేమో !

పరిణీత గా ననెడి భావముతోడ దన్నుఁ
వరియింపు మంచు బలవంతము చేయు నేమో
ధరణీధవుం ! డకట, ధైర్యము జారిపోయెఁ !
తరుణీవిలాపమున ధార్ష్ట్యము తగ్గునేమో !

అనుకంప లేక యిత డారడి వెట్టుచో నే
తనువుం దొరంగుటయె ధర్మము: కాని నాథుం
డనయమ్ము నాకయి మహావ్యథ చెందు నయ్యో!
వనితాత్వ మెందులకు వచ్చెను నాకు దేవా !

సదయుండె కానియెడ క్ష్మాపతి కుంభరాణా
కెదు రేగి రాకొమరు లీభువి నన్ను బోవన్ !
హృదయేశ, యె ట్లయిన నే నిరతంబు యుష్మ
త్పదపంకజద్వయము భక్తిని సంస్మరింతుఁ!

కుంభ రాణా

[ప్రవే శిం చి]

ఆళీసమూహావృతయై మధుపానగోష్ఠిఁ
కేళీమనోహరనికేతనసీమ సంతో

షాలాపముల్ సలుప, కన్యమనస్కు వైయి
ట్లేలా మదీయనయనేందిర వర్తిలంగన్!

గాసిల్లు నీవిమలగాత్రము- లేవ నేలా?
నీసన్నిధానమున నిల్చినవాడు యుష్మ
ద్దాసుండు గాని వసుధారమణుండు కాఁడో
వాసంతికాకుసుమ వల్లరిసన్నిభాంగీ !

చేసన్న కన్గొనుచు శీఘ్రము నీయనుజ్ఞన్
దాసీజనంబు తల దాల్చునె ? సౌఖ్యమేనా
ప్రాసాదమందు? తెలుపంగదె వేడికొందున్-
నీసంశయం బుడిగి నిక్కము రాజపుత్రీ !

నీ వాజ్ఞ యిచ్చునెడ నిష్ఠురకార్య మైనన్
మేవాడభూపతి నిమేషమునన్ భవదీయ
సేవాపరత్వమున జేయును సుమ్ము దేవీ !
వేవేగ చెప్పగదవే భవదాశయంబున్ !

వ్రీడాభరంబునను విహ్వలచిత్త నైతో ?
వీ డింతసేపటికి విస్మృతి దక్కి నన్నుం
జూడంగ వచ్చె విరసుం డని యెంచినావో ?
నే డాయవచ్చితిని నిర్భర మైనప్రేమన్ !

నన్నన్యుగా దలప న్యాయము కాదు బాలా!
మన్నింపగా దగును మానిని, జాగుసేతన్!

ఎన్నడింక కౌఁగిట ధరింతును ని న్నటంచు
నున్నాఁడ నేను కడునుత్సుకతన్ లతాంగీ!

ఏలా ముఖమ్ము పయి కెత్తక యేకనిష్ఠన్
నేలం గనుంగొనెదు నీరజపత్రనేత్రా?
చాలున్ ద్యజించి యిక సంశయబుద్ధి బాలా!
ఆలోకనమ్మున కృతార్థుని జేయ వేలా!

ని న్నెంత వేఁడినను నిర్దయురాల, నన్నున్
మన్నింప వేమిటికి మానము వీడి? పోనీ
క న్నెత్తి యొక్కతృటికాలము గాని చూడ
కున్నావు సిగ్గో, భయమో, మరి విభ్రమంబో!

లంబాలకా, యిపుడు లజ్జ దొరంగవేని
సంబాధితం బగును సాంద్రభుజోపగూహా
సంబంధ భూరికఠినంబుగ నీయురంబు!
బింబాధరంబు పరిపీడిత మౌను జుమ్మీ!

రాజకుమారి

[ గద్గదికతో ]

తగునే యిటుల్ పలుక ధార్మికు లయ్యు దేవా!
జగమందు ధర్మము ప్రచారము చేయువారే
మగువం గనుంగొనినమాత్రమునన్ స్వకీయ
మగునిగ్రహంబు విడనాడుట వింత కాదా!

కుంభ రాణా

తాపమ్ము వాసెను సుధామధురమ్ము లైన
నీపల్కు లీచెవుల నిల్వగ మంజువాణీ!
ఆపాదమస్త పులకావృతదేహ మోహో
చూపట్టు కుట్మలితశోభి కదంబమట్లుల్.

నా కేమి యింతయు కనంబడ లేదు సుమ్మీ
లోకైకసుందరి, త్రిలోచను డైన నిన్నా
లోకించుపక్షమున లోలమనస్కు డౌను.
నే కౌగి లీయగదవే లవలీ లతాంగీ!

రాజ కుమారి

అకటా, కటూక్తు లిటు లాడగ జెల్లునే కా
ముకులట్లు పెద్ద లతిమోహముతోడ? మీరల్
సకలావనీరమణ చక్రిమహాధిపుల్ సే
వకురాలితో సరసవాక్యులు యుక్త మౌనే?

కుంభ రాణా

నీ విట్టు లెంచదగునే హృదయేశ్వరీ, నీ
సేవాపరాయణుడ, సేవ్యుడ గాను దేవీ.

నావాక్కు లీయెడనె నమ్మి ప్రసన్నురాలు
కావేని నీచరణకంజము లంటువాడ!

రాజ కుమారి

వల దిట్టిమాట ప్రభువర్య, రవంతయు న్నా
పలు కాలకింపరు కృపానిధు లయ్యు నయ్యో!
తలిదండ్రులం గొలుచు దానిని మీరు దేవా,
బలిమిన్ హరించితిరి, భావ్యమె యిట్టి చేష్టల్?

కుంభ రాణా

ఆర్యోక్తి తత్పరులమై నిరతంబు వీర
మర్యాదలం దరచు మమ్ముల దూరనౌనే?
శౌర్యోన్నతుల్ మిగుల శ్లాఘన చేయునట్టి
కార్యంబె చేసితిమి, కాదు మహాంహు ముగ్ధా!

దోషం బటంచు నను దూరగ వచ్చు నన్య
యోషన్ హరించునెడ యోగ్యులు: కాని కన్యా
భూషామణీ, యిపుడు భోగ్యవె నీవు. మాతో
భాషింప లేవు నయపద్ధతి సూక్ష్మబుద్ధిన్.

రాజ కుమారి

అసమానశూరులు మహాకవులున్ విపశ్చి
ద్రసికాగ్రిణుల్ వయసు దాటినవారు దేవా,

అసమంజసం బనక ఆస వహింప నేలా
కసుగందనట్టి యొకకన్నె మిమున్ వరింపన్?

కుంభ రాణా

ఆహా, లతాంగి పరిహాసము చాలు. అస్మ
ద్దేహంబునన్ వళులు దేరవు, కేశరాశి
కేహానియుం గలుగ, దేమి కొరంత లేదే
బాహా బలంబునను, ప్రాయము పోయె నొక్కొ!

నీ మీద నోతరుణి, నిర్భర నిష్కలంక
ప్రేమమ్ముచేత నిను పెండిలియాడు కోర్కె
నామానసమ్మున ఘనమ్ముగ నిల్చె, గానన్
భామా, ఒసంగు భుజబంధన సమ్మదంబున్.

రాజ కుమారి

బహుపూజ్యురాలయినపట్టపుదేవి యుండన్
మహివల్లభా, యితరమానిని నామె యెట్టుల్
సహియించు? దేవర విచారణ చేసినారో
బహు భార్యలుండు నెడ బాటిలు బాధ లెల్లన్?

కుంభ రాణా

ఆసంశయంబు విడనాడుము రాజపుత్రీ,
కాసంత యేనియును గౌరవహాని నీకుం

ప్రాసాదమం దెపుడు పాటిల; దింత యేలా
నాసార్వభౌమ పదనాయకురాల వీవే.

రాజకుమారి

అరయంగ నే తగుదునా తమదండ నుండన్ !
కరుణార్ద్రమానసులు కావున దేవ, నన్నుం
ద్వరితంబుగా జనకధామము జేర్ప యుష్మ
చ్చరణాంబుజంబులకు సాగిలి మ్రొక్కుదానన్.

కుంభరాణా

దుర్వారమత్ప్రథితదోర్బలనిర్జితం బౌ
సర్వంసహాస్థలికి చయ్యన రాణి జేతున్
సర్వంబు నీచరణసన్నిధి నుంతు, నింక
గర్వంబు వీడి నను కామిని యేలుకొమ్మా!

రాజకుమారి

నరనాయకా, వలదు నా కివి యేవి, మిమ్మున్
వరియింపజాల- అవివాహితవృత్తి నుందున్-
త్వరితమ్ముగా జనకధామము జేర్ప యుష్మ
చ్చరణాంబుజంబులకు సాగిలి మ్రొక్కుదానన్.

కుంభరాణా

ఆలోచనారహిత మర్థవిహీన మౌని
యాలాపధోరణికి నచ్చెరు వొందుచుంటిన్
బాలా, పదింబదిగ పల్కఁగ నేల, నిన్నున్
నైళంబ యియ్యెడ వివాహము చేసికొందున్.

రాజ కుమారి

ఉభయాభినిష్ట మయి యున్నదె ప్రేమ, మీరల్
విభవాభిరాములును వీరవతంసు లయ్యుఁ
ప్రభువర్య, దీన యగుబాలను వేచ నౌనే ?
అభయం బొసంగి సదయమ్ముగ బంపు డింకఁ.

కుంభ రాణా

ఏ హేతువో తెలియ దింకవిరక్తికి న్నే
నూహింప లేక వెత నొందుచు నున్నవాడన్.

రాజ కుమారి

తెలియంగ లేర జయదేవుని కావ్యగీతి
కలకుఁ మనోజ్ఞ 'రసికప్రియ' నామవృత్తిఁ
వెలయించి నట్టిబహువిభ్రమతభావుకుల్ నా
తలపోత? మీకు విశదంబుగ తెల్పనేలా !

కుంభ రాణా

ఊహింపజాలను గుణోన్నతచిత్త, నీపై
మోహాతిరేకమున ముగ్ధుడ నౌటచేతఁ.

రాజ కుమారి

ఎదిరించుచుంటి నని యెంచగ భోకుడీ, నా
హృదయంబు వేరొకరి కిచ్చితి మున్నె దేవా.

కుంభ రాణా

పెక్కుల్ వచించితిని ప్రేమను, నీమతంబున్
నిక్కంబుగా నెరుగ నేరక రాజపుత్రీ.

రాజ కుమారి

విదితంబు చేసితిని వ్రీడ దొరంగి యస్మత్
హృదయంబు: పంపవలె నింతట నన్ను దేవా.

కుంభ రాణా

చిక్కయ్యె! ఇక్కడకు జేర్చితి నిన్ను నాకై,
యకార్యమున్ సలుప హీనత నాకు బాలా.

నీ కేమియుం గలుగ నేరదు సుమ్ము లోపం
బో కన్యకా, యిచట నుండుము సుఖమ్ముతోడన్.

ఏకారణం బయిన నేర్పడి బుద్ధి మారన్
చేకొమ్ము నన్ను సరసీజదళాయతాక్షీ!

[ నిష్క్రమణము ]

రాజ కుమారి

భయ మెట్లొ తీరినది ప్రస్తుత 'మేకలింగు'
దయచేత! రా జొకవిధంబుగ యోగ్యుడై నన్

భయదంపు దుర్గమున బంధిత నైతి, నయ్యో!
ప్రియు డెంత నాకొరకు బెగ్గిలు చున్నవాడో!

శుకమట్లు పంజరము జొచ్చితి ప్రాణనాథా!
ఇక నెంతకాలమున కీచెర వీడి నే మీ
నికటంబు చేరుదునొ! నెవ్వగ బ్రహ్మదేవుం
డకటా దయారహితుడై లిఖియించె నేమో!

అనిశంబు నాదు హృదయాలయమందు నాథా,
అనురాగ దీపశిఖ ఆరక ప్రజ్వరిల్లున్!
కనుగొంచు, నాయెడద కాంతు డెరుంగు నట్టుల్
పెనుదీప మగ్రిమున పెట్టుదు రాత్రివేళన్.

[ దీపము వెలిగించి ]

మదిలో నిరంతరము " మందర " దుర్గపాలు
పదపద్మముల్ నిలిపి భక్తిని పూజ చేతున్!
బ్రదికించుకొండు తమ భార్య నటంచు తెల్పం
గదె దీపికా, హృదయకాంతున కెట్టులైనన్!

# పరితాప కుమారి

## హమీరసింగు

అచ్చెరు వయ్యె! మీనగరమందు వివాహమహోత్సవాంకమే
యెచ్చట గానరాదు జలజేక్షణ! మీపరివారవర్గమో
ముచ్చట లేక యున్నయది: మోసముపోలిక గోచరించెడున్!
చెచ్చెర సత్యముం దెలియ జేయగదే భువనైక సుందరీ!

ఆయత మైనఖడ్గ మిదె హస్తమునందు, మహాపరాక్రమ
శ్రీయుతు లైనసైనికులు చేరువ కావలియున్నవా రదే.
ఏయెడ దాచెనో పట కుటీరమునన్ నిజసైనికావలిన్
న్యాయము వీడి నీజనకు డంబుజహోజ్జ్వలచారులోచనా!

ఇంకొకమాట విన్నతుగ నెంతయు సిగ్గు జనించుచున్నదో
పంకరుహాయతాక్షి! పొరపాటుగ నీకటిదివ్యమండలా
లంకరణమ్మునన్ నిపుణలగ్నముగా చురకత్తి యున్నదో
అంకిలి చెప్పకే ఘటికి నావల నందుము రాజపుత్రికా!

మాయలలో మహాప్రసిద్ధు మాళవదేవనృపాలు! డందుచే
ఈయెడ జాగరూకత వహింపకతప్పని దయ్యె. నిన్ను మీ
నాయన రాజ్యరక్షకయి నా కుపహారముగా నొసంగెనా?
నీయనురాగమే యిచట నెక్కొనెనా సరసీరుహేక్షణా!

పెంచిలి యాటచే, నెటులో ప్రీతి నటించుచు భర్తృగేహమం
దుండెద నింక యేటి కని యోర్వ వహింపకు రాజపుత్రికా!

ప్రతాప కుమారి

మీనామమ్మును విన్న దాదిగ మదిన్ మీపాదపద్మద్వయీ
ధ్యానంబే యొనరించుచున్నయది యీదాసి ప్రవీరాగ్రణీ!

హమీర సింగు

ఖండిత వాక్యముల్ పలికి కష్టము గూర్చితి నీకు భ్రాంతినై!
సింధుమనమ్ముతో నిపుడు నిన్ను వరించినవాడ ప్రేయసీ!

బంగరుబొమ్మ, నీలలితబాహులతాదృఢబంధనార్థినై
సంగరకర్కశుం డయిన సైనికు డివ్విధిలూరు నెంతయున్!

ప్రతాప కుమారి

మీనిష్కల్మషవాక్యముల్ వినగ నామే నెల్ల కంపించెడున్!
నే నిక్కమ్ముగ నిల్వనేర తమసాన్నిధ్యమ్మునం దోప్రభూ!

హమీర సింగు

మంగళదేవతా, ముఖము మ్లానిమ చెందగనీక బంధురా
లింగన మిమ్ము, దుర్లభ నిలింపసుఖాంబుధి నోలలాడెదన్ !

వింతగ నీముఖాంబుజము విన్నదనంబు వహింప నేల? క
ర్ణాంతవిశాలనేత్రముల నశ్రువు లూరగ నేల? సాధ్వసా
క్రాంతమనోజ్ఞఫాలమున ఘర్మకణంబులు నిల్వ నేల? నీ
వింతవికారముం గనగ నేల? వచింపు త్రిలోకసుందరీ!

పరితాప కుమారి

ఆకర్ణింతురె మీరు మానమహితా మగ్రేసరా, మత్కథన్
మీకోపాగ్నికృశానుకీలలను భస్మీభూతనై పోవుదున్!

హమ్మీర సింగు

నిక్కపుబ్రేమ గాఢముగ నీయెడ నుండగ నాకు, నేటి కో
చక్కనిచుక్క! యింత భయ సంభ్రమగాఢదికవ్రసక్తి? నా
యక్కున జేర్చుకొంటిగద! అన్యవిచారములం త్యజింపుమా!
ఎక్కడ కట్లు పోయెను? క్షమింపుము దోషనికృష్ణతత్వమున్

పరితాప కుమారి

మీకీర్తిధ్వజమందు నిల్చినది యీ మిథ్యావివాహమ్ముచే
ఆకల్పాంతము దుర్భరం బగున నీలాంకంబు వీరాగ్రణీ!

హమ్మీర సింగు

నీమాటల్ మనముం గలంచినవి ఓసీ రేజపత్రేక్షణా!
ఏమాడ్కిన్ ఘటియిల్లు దుర్యశము నా కీతద్వివాహమ్మునన్?

ప్రతాప కుమారి

పౌరుషమందు గణ్యతను ప్రాభవమం దసమాన మైన దీ
ధారుణి బప్పరాట్కులము; తద్వరవంశమునన్ జనించుటన్
మీరు మహాకులీనులును మిక్కిలిపూజ్యులు. కాని నేటితో
గౌరవహాని సంఘటిలె నైకొనుటన్ నను ధర్మపత్నిగాన్.

నాయనగారు సౌమ్యముగ నన్ను నొసంగుటలోన మీ కయో
మాయ మహానిగూఢ! మిది మంగళదేవత కాదు! శుభ్రమా
మీయశమున్ హరించుటకు మేదినిమీద మనోహరాంగనా
కాయముతోడ సంభవము గాంచిన పెద్దపిశాచ మోప్రభూ!

కావున మండలాగ్రమున కాయము జీల్చి కవోష్ణరక్తధా
రావభృథంబునం బున రనావిలమై నిజకీర్తిచంద్రికల్
దేవ, వెలుంగగా నిఖిల దిక్తటులందు సమాచరింపుడీ
భూవరధర్మ, మత్యధికపుణ్యము నాకు లభించు రూఢిగా!

హమీర సింగు

ఏమాత్రమ్ము భయమ్ము లే, దిక నిజం బేమో నిరూపించి ని
స్సీమానందము నాకు గూర్పదగదే శీఘ్రంబ ప్రాణేశ్వరీ!

ప్రతాప కుమారి

ఊహము నాకు లేనపుడు యోధకుమారునితోడ జేసి రు
ద్వాహము తల్లిదండ్రులు వివాహముమాత్రము కాకపూర్వమే

ఆహవభూమియందు నత డంతము నొందెను పోరు సల్పుచుఁ.
సాహసముఁ వహించి కలసత్యము పల్కితి ప్రాణవల్లభా !

హామీర సింగు

పాదద్వంద్వము వీడి లేవగదవే ప్రాణప్రియా ! ఇంక నీ
ఖేదమ్ముఁ విడనాడి నాభుజముపై గ్రీవమ్ము గీల్కొల్పవే !-
ఏదీ నాప్రియకాంతకుఁ సదృశురా లేతన్మహాంభోధి మ
ర్యాదాలంకృతధారుణీతలమునం దంభోజపత్రేక్షణా !

మిథిలానగరమున రాచనగరిలో కన్య

మఖాదేవ ప్రభువు

పాటలీపుత్రమ్ము వారలు
పంపినారు మహామనోహర
వివిధపరిమాణాకృతుల్ గల
విమలదర్పణముల్.

వచ్చియున్నవి వింధ్యభూధర
వనమదస్తంబేరమమ్ముల
దివ్యదంతవినిర్మితము లౌ
తెల్లదువ్వెనలున్.

రమ్యకోసలదేశవివిధా
రామసీమలలో మనోజ్ఞ
ప్రసవసారమునుండి తీసిన
ప్రథితతైలంబుల్-

పెట్టియున్నవి రమ్యచందన
పేటికాంతర్గత మనోహర

కాచపాత్రికలందు నెంతయు
ఘ్రాణపర్వముగన్.

త్వరితముగ బోవలయు రాజ్ఞి
దర్శనార్థం బోడపాలీ,
చతురిమమ్మున కేశసంస్కృతి
సలుపు మీవేళన్.

పట్టుకొమ్మా కాంచనావృతి
బద్ధనూతనవలయముకురము
సమ్ముఖంబున యవనబాలా,
జాగరూకతతోన్.

స్తంభనికటమునుండి తెమ్మా
సత్వరంబుగ నోసుభద్రా,
పసపుపచ్చని పట్టుదిండుల
పాదపీఠంబున్.

కేశజాలము చెదరకుండగ
కేకిపింఛముతోడ విసరుము
మద్రచామరవాహినీ, యిటు
మందమందముగన్.

పదవిలాససమంచితం బై
భవ్యభావతరంగితం బగు

పాట పాడంగదె విశాఖా,
పంచమశ్రుతిలో.

విశాఖ

అఖిల భువనములం దకుంఠిత
మా పరితాపముతో వెలింగెడు
పంచసాయకు డొక్కడే నా
పరమదైవతము !

సకలయోగీశ్వరుల కగ్రే
సరుడు ఫాలవిలోచనుండే
స్మరుడు దూరమునందు నిలువగ
సంచలన మొందెన్.

ప్రసవబాణము తనువుమీదను
పడకమున్నె శివుడు గిరిజా
వదనబింబముమీద ప్రేమను
వాల్చె లోచనముల్.

బాణపాతం బైనచో ఆ
భర్గు డేమయి యుండువాడో!
పర్వతాత్మజ కప్పు డెంతటి
ప్రమద మబ్బెడిదో.

నిజగళంబున హాలహల విషమును
నిలిపి. మృత్యుంజయుం డయ్యెను;
అగ్నిదగ్ధుం డయ్యు బ్రిదికిన
యాత డెవ్వ డగున్ ?

నామతంబున, సాటి యెఱుగని
నాయకుం డొకమనసిజుండే:
అతను డయ్యును నడపు లోకము
లాత్మపాలనలో.

అట్టియుజ్జ్వల చండశాసను
నర్చనమ్ము నిరంతరమ్ముగ
నిష్ఠ సలుపం దగినకాలము
నిండుజవ్వనమే.

అహరహంబును వేచియుండును
యౌవనంబును మ్రింగి వేయగ
జరయు వ్యాధియు వ్యాఘ్రిభంగిని
చండవిస్ఫూర్తిన్.

ఏదినంబున వలీపలితము
లేర్పడుం దనుమస్తకంబుల
ఆదినంబున దొలగ మొదలిడు
నతనుకృపకూడన్.

## పలిత కేశము

జవ్వనంబు హరించి పోవగ
సాగుకొలదిని వృద్ధి గాంచును
కామినులపై నక్కజంబుగ
కాంక్ష పురుషులకున్.

పలితమూర్ధవిలోకనమ్మున
ప్రాభవమ్మును ధనము విద్యను
పరిగణింపదు యువతి విముఖీ
భావసంగతయై.

విజయ మొందెడు గాక యౌవన
విభ్రమోత్కర్షమ్ము మన్మథు
నిబిడకరుణాకటాక్షమ్మున
నిఖిలలోకములన్.

నిరత మానందాతిశయమే
నెగడు గావుత రూపసంపద
పంచబాణసమాను డగు మా
ప్రభువతంసునకున్.

## మఖా దేవుడు

ఎంత దివ్యం బహహా దేహం
బెంత దివ్యం బవుర యౌవన

మెంత దివ్యం బహూహా తరుణీ
హాసవిభ్రమము !

ఎంత చక్కనిపాట పాడితి,
ఇది రచించిన కవివరేణ్యుడు
మనపురంబున నున్నచో బహు
మాన మంపుమనే.

ఐ శా

చరణసేవకురాలి సవ్య
స్సాహసంబు క్షమింపవలయును!
పరకవి ప్రోక్తంబు కా దీ
పాట ప్రభువర్యా !

కామసన్నిభులైన దేవర
గాత్రసంపద్విలోకనమున
పాదసేవకురాలిముఖమున
బయలుపడె దేవా !

మఖా దేవుడు

ఆశుగతి నీలలితముఖమున
నవతరించిన గీతామృత మిది !

హారమిదిగో వైతు రమ్మా
అంతికమ్మునకున్.

వి శా ఖ

దీప్తి గాంచు నమూల్యహారము
దేవ, యుష్మత్కంఠసీమనె.
అంత మన్నన కీతపస్విని
యర్హురా లగునే ?

మఖా దేవుడు

ప్రాకృతమ్మున నేటివరకును
పడతి కవనము చెప్ప నెరుగము.
కలిగె నర్హత నీకు ప్రభు వా
క్యమ్ముచే బాలా !

ఉ పా లి

దేవ, కంఠమునుండి హారము
తీయుచో నిదె చిక్కువడినది
మూర్ధజావళి, సంస్కరించెద
మొదటిచందమునన్.

కలిగె గమనవిలంబనం బీ
ఘటనలో నొకయింత దేవా.

మఖా దేవుడు

పోనిలే కానిమ్ము వేగమ
పూర్ణ మండనమున్.

నిలువు మోసి విశాఖ, సద్రుఢ
నీల కుచబంధమ్ము మీదను
కాన వచ్చెను ధవళ రేఖా
కారమున నేదో.

విశాఖ

వాయువశమున ధవళతంతువు
వాలియుండగ నోపు దేవా.

మఖా దేవుడు

తీసి యిమ్మటు పలితకేశము
తెరగునం దోచున్.

కంఠ దేశమునుండి హారము
గ్రక్కునం దొలగించువేళను

దాస లగ్నం బయ్యె నెట్లో
ధవళకేశంబు.

నలువదేడులు నిండె మొన్ననె,
నడువయస్సున నున్నవానికి
ఉత్తమాంగమునందు పలితం
బుదయ మొందినదే!

గోచరించెను జరాసూచన,
కొన్నినాళ్ళ కసంశయమ్ముగ
శిరము ధవళం బగు హిమాలయ
శిఖరి చందమునన్.

ఉపాలి

వేటకై చని మొన్న మొన్ననె
విపినభూమిని శూలముఖమున
వ్యాఘ్రహననము చేసియుంటిరి,
వార్ధకంబ ప్రభూ?

మఖాదేవుడు

భోగలాలసులైనవారికి
పోవు నోజము సత్వరమ్ముగ.

విషయసుఖముల నుండి పురుషుడు
విరతి చెంద దగున్.

జగము సర్వం బనిత్యంబే!
జనన మరణ ప్రవాహములో
కర్మబద్ధుం డగుచు జీవుడు
క్రమముగా దిరుగున్.

సకలసంసారమ్ములో నే
జాడ గాంచిన మనఃక్షోభము
గాఢ వాంఛలు భూరిదుఃఖము
కాన బడుచుండున్.

శాశ్వతం బగువస్తు వీ సం
సారమధ్యమునందు గలదా?
చిత్త విక్షోభోపశమన
స్థితియె చేకురదా?

స్వాంతమందు నిరంతరము జా
జ్వల్యమానము లైన కోర్కులు
శమము గాంచి ప్రశాంతి కల్గెడి
సరణియే లేదా?

సకల కారుణి కాగ్రగణ్యుడు
శాక్యముని సింహుంపు జనులకు

ఈయనిత్యతయందు శాశ్వత
మేదో తెల్పె గదా.

పరమపూజ్యుం డైన బుద్ధ
ప్రభువు కన్గొని దుఃఖతత్త్వము
దివ్య మగునిర్వాణ మార్గము
తెలిపియుండె గదా.

దుఃఖసంవృత మఖిలలోకము,
దుఃఖమూలము తృష్ణ, దానిని
దుృంచి వేసిన దుఃఖజాలము
తొలగిపోవు గదా.

అనుసరించిన యెడల ఆర్యా
ష్టాంగమార్గ ముపాసకాళికి
భూరి నిర్వాణాప్తి: ఇదియే
బుద్ధ శాసనము.

మందబుద్ధుల మగుటచేతను
మరచిపోవుచు మాతథాగతు
నమల బోధసుధాస్వరూపా
ష్టాంగ మార్గంబున్.

ప్రకృత వేషం బింక మార్చెద.
పచ్చబట్టలు తెమ్ముపాలీ,

సత్వరంబుగ బిల్వ నంపుము
స్థవిర ముద్గల్యాన్.

శరణు చొచ్చెద బుద్ధదేవుని
శరణు చొచ్చెద బౌద్ధధర్మము
శరణు చొచ్చెద బౌద్ధసంఘము
శాంతి నా కింకిన్!

నమో తస్స భగవతో అరహతో సమ్మాసంబుద్ధస్స!

# ప్రభు వాక్యము

## ప్రథమ రంగము

శ్రీ నీలాచల క్షేత్రములో మహామాత్యుని భవనమున

రూపాంబిక — కాంచీరాజపుత్రి
పురుషోత్తమదేవుడు — ఉత్కళదేశరాజు
మహామాత్యుడు. ప్రతీహారి. ప్రజలు

ప్ర తీ హా రి

జయము జయము మహామాత్య
సత్తములకు! పాదదాసి
వినతిపూర్వకమ్ముగా నొనర్ప
విజ్ఞాపన మరుగుదెంచె.

మ హా మా త్యు డు

ఇపుడు వచ్చితి వేమి? ఈతొట్రుపా టేమి?
ఆకస్మికమ్ముగా అహితమ ముదయించెనా?

ప్రతీహారి

అనుకంప వహించి హఠా
దాగమనము క్షమియింపుము!
కాంచీ రాజకుమారిక
గాఢశోక తప్తురాలు
దర్శనార్థ మరుగుదెంచి
ద్వారముకడ నిలుచున్నది.
ఆనతి యగునేని లోని
కామెను దోడ్కొని వత్తును.

మహామాత్యుడు

ఈ మాట తొలు దొల్త ఏల చెప్పవు నీవు?
కాంచీ కుమారి, రాగదవమ్మ లోపలికి.

[ ఆమె లోనికి వచ్చి నమస్కరించి నిలుచును ]

ప్రతీహారి

చేయక తప్పద పెండిలి
శ్రీమద్రాజకుమారికి
ఈనాడే? కొంతకాల
మెట్టులైన గడచునెడల
ప్రభునకు కనికరము కలిగి
పట్టుదలను విడుచునేమొ.

మ హా మా త్యు డు

ఉత్కళేశ్వరుడు తా నొసగి యానతి తొలుత
అన్యథా చేసెనా అవల నెన్నడు గాని?
కనికర మ్మదయింప కారణం బేనాడు
కలిగెనా ఆకస్మికమ్ముగా నేదేని?

ప్ర తీ హా రి

కాలము గడచిన కొలదిని
కరగ వచ్చు ప్రభుని మనసు.
దర్శన మొసగిన పిమ్మట
దయసైతము కలుగవచ్చు.
దయకును దండనమునకును
ధరణీధవులు సమర్థులు.

మ హా మా త్యు డు

పురుషోత్తమదేవ మహా
భూమీపతి యద్వితీయ
చండశాసనుం, డానతి
జనులకు సుగ్రీవాజ్ఞయె.

కాంచీనాయకులు తిర
స్కారము చూపించినార
లస్మత్ప్రభునకు; కావున
ఆగ్రహించినాడు రేడు.

రూ పాం బి క

ఒక మాట మాత్రైన
కుత్కలేశ్వరు డింత
కాఠిన్య మూన దగునా
ఎం దైన
కార్య మిట్టిది కంటిమా!
మాట అన్నందుకే
మారాజ్యము జయించి
సాధించి వచ్చె గాదా
ఇక నైన
శపథమ్ము విడువ రాదా!
మాతండ్రి తన నేమొ
మాట అన్నా డనుచు
నను బట్టుకొని తెచ్చునా!
ఇది మీరు
న్యాయ మనుకొన వచ్చునా!

మ హా మా త్యు డు

ప్రభువు కఠినుడు కాడు, పరమకారుణికుండు,
సరసుండు, శర ణన్న శత్రువున్ క్షమియించు
చండశాసను డయ్యు శత్రుభీకరు డయ్యు.
మనుజనాయకు లెల్ల మాటపట్టింపుచే

ఎంత లెంతలో చేతు: రిది క్షత్రియులరీతి.

ఉత్తమ క్షత్రియుం డుత్కలేశ్వరుడు నీ
మీది ప్రేముడిచేత మీతండ్రి నర్థింప
తోడనే యతడు సంతోషపూర్వకముగా
నిను సమర్పించి పాణి గ్రహణోత్సవం
బొనరింప వలె ననుట యుక్త మౌనా కాద?

సీతండ్రి అటు చేయనేర కుత్కళనేత
క్షత్రియుండే యయ్యు సమ్మార్జకుం డనియు
తన కులము స్వచ్ఛ మని తనయ నీయ నటంచు
అవహేళనము చేయు టనుచితం బన వేమి?

రూపాంబిక

సమ్మార్జకుం డనుట చాలదోషమె కాన
అన్నదానికి ఫలిత మనుభవించెను కాద
మాతండ్రి !

జనకు మాటకు తనూజాత నిటు శిక్షింప
మీవంటి సజ్జనుల్ మెచ్చుకో దగినదా
సెల విండు

మహామాత్యుడు

పితరుల మాటకు బిడ్డలు బాధలు
పడుదురు తల్లీ, ప్రపంచకములో!

అందులకే మాయపనీ ధవుడనె
సమ్మార్జకునకె జాయ వగుదు వని.
ఇది న్యాయం బని యెవ్వ రనరు; మరి
జనపతి మాత్రము చండశాసనుడు!

రూ పాం బి క

తనయెడ భక్తియు తాత్పర్యము గల
అబలమీదనా ఆగ్రహ మూనుట!
నిజముగ నాపై నెనరే యాదిని.
ఉత్కలేశ్వరున కున్న పక్షమున
కైవస మగు మా కాంచీపురిలో
పెండ్లి యాడడా పేరిమితో నను?

మ హా మా త్యు డు

ఉండెను తల్లీ, ఉత్కలేశునకు
నీపై ప్రేముడి నిండుగ నాదిని.
సౌందర్యంబును సద్గుణ వర్ణన
మాలకించి రేడనురక్తుం డయి
నిన్ను గూర్చియే, నిరతము నాతో
సంభాషించెను చాల దినమ్ములు.

రూ పాం బి క

అంత ప్రేమ మంతలోనె
అంతరించి పోయె నెట్లు!

అనురాగము కన్న నృపతి
కభిమానము ముఖ్య మాయె!

ప్ర తీ హా రి

ప్రభుపాదంబులపై బడి
ప్రార్థించిన లాభ మేమొ.
మనసు కరగదా రేనికి
మానినీ దైన్యమునకు?

రూ పాం బి క

కనికరమున నృపతి నన్ను
కన్నియగా విడుచునేని
ఏకామేశ్వరు గొలుచుచు
ఈజన్మము గడపుదాన!

మ హా మా త్యు డు

త్వరలో అన్నాడు, కాని
తప్పదు రాజాజ్ఞ తల్లి!
నీ వెరుగవు రేడెంతటి
నిశ్చలుండొ మాటపట్ల!

రూ పాం బి క

కన్యగా జన్మమ్ము గడప వీలే లేద!
సమ్మార్జకున కేను జాయ కావలయునా!

అక్కటకటా! ఎంత అన్యాయ మన్యాయ
మాత్మహత్యకు గూడ ఆయుధము లేదాయె!
కంచి కామాక్షమ్మ, కరుణించదా నన్ను!
ఏకామ్రనాధునకు ఏమి దయ కలుగదా!
కైలాసనాధునకు కారుణ్యమే లేద!
కాంచీకుమారి కీగతి పట్టు వలసినద!

మ హా మా త్యు డు

ఏద్వ కమ్మా! ఇప్పు డేమి చేయుదు నేను?
దుఃఖ మెరుగుదు: నాకు దుహి లున్నా రమ్మ!
ప్రభు వుంచినాడు నీ పరిణయము కావించు
ప్రబలబాధ్యతను నాపైన రాజకుమారి!

రూ పా ం బి క

ఈయాపద నుండి నన్ను
ఎట్టులైన రక్షింపుడు!
తండ్రి, ఈదీనురాలి
తనయగా భావింపుడు!

పరిణమిల్లితి తావకీన
పాదాంభోరుహములపై.
అభయ మిచ్చువరకు తండ్రి,
అడుగులు విడువంజాలను!

బ్రాహ్మణ శేఖరు, లఖిల
ప్రజ్ఞలు మీకరగతములు.

కనికర ముదయించిన నను
కాపాడుట సుకరం బగు.

ఆలోచించినచో నా
యాపద తప్పించుటకై
మహామాత్యులైన మీకు
మార్గము దొరకక పోవునె!

దుర్గతి అదృష్టవశమున
తొలగిపోవునేని నేను
ఆమరణము మీకృతజ్ఞు
రాలనుగా నుందు తండ్రి!

రక్షింపుడు, రక్షింపుడు
రాజకుమారిక అయ్యో
సమ్మార్జకునకు నేగతి
జాయగ జీవింపగలదు!

మ హా మా త్యు డు

ఏడవ కమ్మా, ఏడవకు!
పెద్దభారమే పెట్టితి వమ్మా!
కానీ చూతము కాగల దేదో.
ఉర్వీపతి పురుషోత్తమదేవుడు
కఠినమానసుడు కాడు కుమారీ!
అదె ధైర్యంబున కాధారం బగు.

దుస్సాధమే యైన తోచుచున్నది యొకటి.
నీకు ద్వేషము లేదు నృపునియెడ నని యెంతు.
శీఘ్రకాలములోనె శ్రీమజ్జగన్నాథు
కారుణ్యమున నీకు కల్యాణ మగు గాక!

## ద్వితీయ రంగము

శ్రీ పురుషోత్తమ దేవమహారాజు జగన్నాథమందిర ప్రాంగణమును సమ్మార్జనితో ఊడ్చుచుండును.

మ హా మా త్యు డు

మహాప్రభూ, జయము, జయము!

పు రు షో త్త మ దే వు డు

మహామాత్యా, వందనమ్ము!

మ హా మా త్యు డు

స్వామిసేవయందు ప్రభువు
చాల మగ్ను లయినవారు.

పు రు షో త్త మ దే వు డు

ఎల్లవారు సేవకులే ఈమహాప్రభునిమ్రోల!
గౌడకో కళింగమునకో కాంచికో ఉత్కళముకో
స్వల్పభాగములకు ప్రభులు చాలమంది కలరు, కాని

సకలలోకములకు ప్రభువు
జగన్నాధదేవు డొకడె!

మ హా మా త్యు డు

తమకు గల్గుభావ మితర
ధరణిపతుల కుండునేని
ఈలోకము స్వర్గముగా
ఎన్నండో మారియుండు!

పు రు షో త్త మ దే వు డు

స్వామిసేవలోన ఎంత
సౌఖ్య మున్న! దీధరణో
పాలనమ్మువలన నాకు
ప్రతిదినమ్ము జగన్నాధ
దేవ కైంకర్యమునకు
తెరపి లేదు మహామాత్య!

మ హా మా త్యు ఁ డు

నడచు ధర్మదేవత తన
నాలుగుపాదాలతోడ
ఈయుత్కలరాష్ట్రమందు
పలికగా నుండ తమరు!

పు రు షో త్త మ దే వు డు

పరశురామాదిమహా
బ్రాహ్మణవీరులు పూర్వము

పృథివి యెల్ల గెలిచి, మట్టి
పెళ్ళవోలె, నిర్మమునై
దాన మిచ్చి, ముదముతోడ
తపమునకై వెడలినారు!
ఈకలికాల ప్రభావ
మేమి చెప్ప! ఇంచుకంత
మహి నేలెడిరాజు లెంతో
మదించి వర్తింతు రవుర!

మహాత్ముడు

కావుననే రాజర్షులు
కావలె ధరణీకాంతులు.

పురుషోత్తమ దేవుడు

ఏడాదికి నొక్కనాడు
ఈనీలాచలతీర్థ
ప్రభు జగన్నాథాలయ
ప్రాంగణ పవిత్ర భూమిని
గొప్ప లుజ్జగించి అన్ని
కులములవా రఖిలమ్మున్
జగన్నాథ మన్న మహా
సరససూక్తి కనుగుణముగ
ప్రసాదంబు స్వీకరించి
పవిత్రు లగుచున్నవారు!

ఎంత పూతవాసరంబు!
ఎంత శుభద వాసరంబు!

మ హా మా త్యు డు

శ్రీమజ్జగన్నాథ సేవానురక్త తా
దేవరవారి కీ దివ్యప్రదేశాన
గొప్ప కానుక నొసగ గొని వచ్చి యున్నాను.
భూసురాశీర్వాద పూర్వకమ్ముగ దేవ,
శ్రీసన్నిధానాన స్వీకరింతురు గాక!

పు రు షో త్త మ దే వు డు

మావృద్ధి గాంక్షించు మంత్రి వర్యులు, మీరు
బ్రాహ్మణోత్తములు, మీ పల్కు లాదరముతో
శిరసా వహించి నే స్వీకరించితి కాన్క!

మ హా మా త్యు డు

[సంజ్ఞచే సమీపించి వినత యయిన రాజకుమారిని చూపి]

తమయెడ భక్తితాత్పర్యముల్ కలిగి
రాణికి నుచిత మారమణీయ సకల
శుభలక్షణాలతో శోభిల్లు కన్య
నాదరింపుం డుత్కలావనీ రమణ!

పు రు షో త్త మ దే వు డు

కనంపుబొమ్మయే కానుక యనుచు
భావింప నైతిని ప్రమదంబు : కాని

ఇంచుక వివరింపు డెవ్వ రీకన్య.

మ హా మా త్యు డు

కాంచీకుమారి యీకన్యాలలామ,
ముక్తేశ్వరసేవ నోదిక్తహృదయ.

పు రు షో త్త మ దే వు డు

వెనుకటి మాయాజ్ఞప్తికి
విపరీతముగా మీరలు
చేయదలచినారు: మిగుల
చిత్రముగా నున్న దార్య!

ఈమెను సమ్మార్జకునకు
ఇచ్చి వివాహము చేయగ
వెనుక నాజ్ఞ యిచ్చినాము:
విస్మరించినారో దాని!

మ హా మా త్యు డు

మహాప్రభూ, తమయానతి
మరవగ నెవ్వారి తరము!
ప్రభువాక్య మ్మక్షరశః
పాలింపగ వచ్చినాను.

అధిపశ్రేష్ఠులు తప్పరు
ఆడిన వాక్యం బెన్నడు.

పురుషోత్తమ దేవుడు

అధిపతి యిచ్చిన యానతి
నన్యథా చేయరాదు.

మహామాత్యుడు

చిత్తము! కావున దేవర
స్వీకరించి తీరవలయు
కాంచీ రాజకుమారిని
కాపాడుకొన ప్రతిజ్ఞ.

స్వర్ణదండ మండిత మా
సమ్మార్జనితో దేవర
స్వామి యూడిగంబు సేయు
సమయము కాదా యియ్యది!

పురుషోత్తమ దేవుడు

[తేరిపార జూచి మందహాసముతో చేతులు జోడించి]

మహనీయము భూదేవా
మాత్యబుద్ధి కౌశలంబు!

మహామాత్యుడు

మహాప్రభువు సరసహృదియె
మహనీయము మహనీయము!

పు రు షో త్త మ దే వు డు

కాంచీ రాజకుమారిని
గౌరవమ్ముతో సువర్ణ
పల్యంకిక గొనిపోవుడు
ప్రాసాదమునకు వేగమె.

[ హ ర్ష ధ్వ ను లు ]
మ హా మా త్యు డు

శ్రీ పురుషోత్తమ దేవ
క్షితిపాలాగ్రణికి జయము!
జగన్నాథ మహాస్వామికి
జయము జయము జయము జయము!

# భా మ తి

కవివరేణ్యులు మీయశోగానములను
నవ్యపదబంధముల జేయునాడు గాని
అఖిలశాస్త్రవిశారదు లైనవారె
వేడి మీకడ జదివెడునాడు గాని,

మాన్యభావముతో, బహుమతులతోడ
నరపతులు మిమ్ము దర్శించునాడు గాని
కలుగనే లేదు సంతోషగరిమ మీకు:
ఇప్పు డింత హర్షోత్కర్ష మేల నాథ?

వాచస్పతి మిశ్రుడు

అర్ధఘటికక్రింద నవసితం బైనది
బ్రహ్మసూత్రములకు భాష్యవివృతి.
పరమపురుషుకృపను ప్రారీప్సితగ్రంథ
మంతరాయరహితమై చెలంగె.

ప్రణతి సూత్రకార బాదరాయణమౌని
చంద్రు దివ్యపాదజలజములకు;
చేతు వందనంబు శ్రీశంకరాచార్య
వర్యు దివ్యపాద వనజములకు;

అధిక భక్తితోడ వ్యాఖ్యానకర్త లా
యతులచరణములకు నతు లొనర్తు;
బ్రహ్మవాదు లైనపండితోత్తములను
సమ్మదంబుతోడ సంస్తుతింతు.

బ్రహ్మవిద్యకన్న పరవిద్య యున్నదే
సకలదుఃఖతరణసాధనంబు !
నేను వివృతి మిగుల నిష్పక్షబుద్ధితో
జేసినాను పరమశివునికృపను.

భామతి

మీరు దర్శనవాఖ్యలమీద మున్ను
విశదముగ వ్రాసినట్టియావివృతు లెల్ల
సంస్తుతింపరె త తదాచార్యవరులు
తమతమమతానుసారముల్ తథ్య మనుచు.

వాచస్పతి

విమలశాస్త్రదృష్టి విద్వజ్జనంబుల
వెలయజేయుబుద్ధి వివృతు లేను
ముప్పదేండ్లనాడు మొదలిడి యీనాటి
వరకు నేకనియతి వ్రాసినాడ.

అఖిలదర్శనంబు లవలోడనముచేయ
శాస్త్రహృదయలబ్ధి సంఘటిల్లె.

గ్రంథరచన చేయుకాంక్ష యీనాటితో
సఫల మయ్యె; కృతులు చాలు నింక.

విహితకృత్యములను విధివిధానమ్ముగా
సలుపుచున్నవాడ శ్రద్ధ బూని.
శాంతితోడ నింక సకలమ్ము త్యజియించి
పరివ్రజింతు నేని పరమశుభము.

భా మ తి

సకల మవగత మహామహాశయులు మీరు,
అజ్ఞురాలను నేను: సాహసము బూని
భర్తృభాషణమున కిట్లు ప్రతివచనము
నిచ్చుచున్నందులకు క్షమియింప దగును.

విధివిధానముగా మీరు విహితకర్మ
లాచరించుచు నున్నట్టు లనుటచేత,
ఉండు గార్హస్థ్యవిధులలో నొక్కకొరత
చేసినా రని దృఢముగా చెప్పగలను.

గురుకులపరిశ్రమమ్మున కొన్నియేండ్లు,
పరివచనమ్మున కొన్నియబ్దములు, గ్రంథ
రచనతోడను కొన్నివర్షములు గడచె:
వెడలె మీకాల మంతయు విద్యలోనె.

శాస్త్రములయందు వ్యసనమ్ము సముచితమ్మె
కొంతవర; కైన నింతటిఘోర మెరుగ!

ప్రబలవిద్యాపిశాచి ప్రప్రథమమందె
అతితరమ్ముగ మిమ్ముల నాక్రమించె!

ఏమి భుజియించుచుందురో ఎరుక లేదు,
ఏమి ధరియించుచుందురో ఎరుక లేదు,
ఈతపస్వినిగతి యేమొ ఎరుక లేదు,
ఏమి విద్యాప్రభావమో ఇది మహాత్మ!

కాల మంతయు విద్యల గడపినారు,
కలుగనే లేదు సంతానకాంక్ష మీకు.
భార్యయనుమతి లేకుండ ప్రవ్రజింప
దలచు టెట్టిది యనపత్యధర్మవేత్త!

వా చ స్ప తి

బాష్పమోచనంబు బలహీనతాచిహ్న,
మింత బేల వనుచు నెంచనైతి.
ఈషణమ్ము విడువ మికనైన: సంతాన
ముదయ మొందకున్న కొదువ లేదు.

భా మ తి

చాలు లెండు, మీకు సంతానవాంఛయే
లేదు మానసమున లేశమైన!
ఆడుదాని కుండ దంతవైరాగ్యంబు :
వంధ్య నన్నమాట వాస్తవంబు.

వా చ స్ప తి

పుత్రసంతానకామంబు పొడమ లేదు
పూర్వ మెన్నండు; గతమును పోవనిమ్ము.
ఇప్పుడైన ప్రయోజన మేమి యుండు?
ఉభయులకుగూడ యౌవన ముడిగిపోయె.

నీవు సహధర్మచారిణీ, నిశ్చయముగ
ఉత్తమపతివ్రతవు: లెక్క కొక్కనాడు
గాని యించుక లోపమ్ము కలుగకుండ
శ్రద్ధతో నాకు శుశ్రూష సలిపినావు.

ధీరురాలవు, తక్కిన స్త్రీల కట్లు
వస్తుసంతతిపై నీకు వాంఛ లేదు.
తగునె యింతటివెఱ్ఱి సంతతి యనంగ?
కొడుకు లున్నంతమాత్రాన గొప్ప యేమి?

భా మ తి

గొప్ప కాక యేమి! కొడుకులు జనియించి
మిగుల యోగ్యు లగుచు మెలగునపుడు
ఇంత దొడ్డసుతుల నేతల్లి కన్నదో
యనుచు లోకు లామె నభినుతింతు్రు.

వా చ స్ప తి

యశమె భవదీయవాంఛిత మైనయెడల,
నిలుచు విశ్వజనీనమై నీప్రతిష్ఠ.

ఈదినమ్మున నే ముగిఁయించి నట్టి
వివృతి నీపేర లోకాన వెలయ జేతు.

భా మ తి

నాకు కీ ర్తి వలదు! నలువురినోళ్లలో
బడగనీక నన్ను బ్రదుకనిండు!
ఒరులనోట బడక యుష్మత్పదాంబుజ
సేవ జేయుచున్న శ్రేయ మొదవు.

వా చ స్ప తి

నాకృతికి పూజ్య మైననీనామధేయ
ముంచినాడను; లోకమం దొప్పు గాక
భామతివ్యాఖ్య మిశ్రునిభార్యపేర
సకలవేదాంతవాదులు సన్నుతింప!

# లోపాముద్ర

౧

ఏమి విపరీత మిది! ఎంతతడ వైనన్
మోము పయి కెత్తరొకమూర్తమును నాథా!
ఈ మొయిని మానము వహించి వెనుచింత
న్నామనముసం బిటులు నాట దగు నొక్కొ!

౨

స్వామి, దయరాదు! తమసన్నిధిని నేనీ
యామమును బుచ్చితి మహాతురతతోడన్.
కామము వహించు నిజకాంత నెడసేయ
న్నేమ మగునేని కడునిష్ఠురము నాథా!

౩

చేయుచును మీచరణసేవ యొకనాడున్
బాయక భవత్సవిధభాగము మదీయ
ప్రాయమును బుచ్చితిని. భార్య ననురక్తన్
న్యాయ మగునే యిటులు నాథ, నిరసింపన్!

౪

నామమున భార్య నయినాను, గణియింపన్
కామితము దీరి బహుకాలము గతించెన్!

ప మనగ వచ్చు కలనేని నిజకాంతా
క్షేమ సుఖముల్ తలపు సేయని మహాత్మన్ !

౫

భంగ మగు నిష్ఠ నిజపత్ని మృదుదేహా
లింగనము సేయు నెడ! లేశ మయినన్ స్త్రీ
యాంగనల నిండుహృదయంబులను ఛేదిం
పంగ ఘటియిల్ల దట పాపము మహాత్మా!

౬

నేను విషువం దగదె నిష్ఠురత నాపై,
ఆదు దని చిన్న దని యైన కృపతోడన్!
పీడ విడనాడి కడు వెర్రి దయి యెంతో
వేచు కొనుకాంత గను పిచ్చి కనరాదో!

జవ్వనము పూర్ణముగ జారుటకు మున్నే
యివ్విధిని మీరు త్యజియించి యిహసౌఖ్యా,
లెవ్వియొ తపస్సు లని యెల్లపుడు నన్నున్
దవ్వులనె నిల్పితిరి: ధర్మమె మహాత్మా!

౮

మీర లొనరించునవి మేము గ్రహియింప
న్నేరుతుమె! మీ ఋషులు నిశ్చలమనస్కుల్.
క్రూర మగు గాక తమకోరిక యె యెట్లో
తీరుచుకొనం గలుగు ధీరులు మునీంద్రా!

౯

ఏలనో భవాదృశుల కీజగముపై ను
ద్వేలము విరక్తి యని విశ్రుతము. మాకో
చాలదు గ్రహించుటకు శక్తి లవ మైనన్
వేలుపు జగమ్ముపయి వెర్రి మునిచంద్రా!

౧౦

ఒక్క విపరీతగుణ మున్న యది మీలో
నక్కజము గొల్పు! నిఖిలార్యులకు పుత్రిల్
పెక్కు రుదయించునెడ ప్రీతి యధికం, బా
దిక్కునను లేదు తమ దృష్టి మునిమౌళీ!

౧౧

సంతసము, విప్పితిరి చక్షువులు నాథా!
స్వాంత మెటులో కరగుచాయ పొడకట్టెన్.
వింతగను నిల్పితిరి వీక్షణము పాదా
క్రాంతసతిపైన బహుకాలమున, కాహా!

౧౨

మోదతే నిజవిభో ర్వదనాబ్జం
వీక్ష్య మందహసితం కులకాన్తా
ప్రాణనాథ పరిరంభణహర్షా
జ్జాయమాన పులకాంచిత దేహా!

# వి ష యా ను క్ర మ ణి క

# సంపాదకీయము

పవిత్రహృదయులు శ్రీ తల్లావఝ్ఝల శివ శంకర శాస్త్రి గారు మాకు చిరకాలమిత్రులు. నవ్యాంధ్రసాహిత్య లతకు దోహదము కల్పించినవారిలో వీరు ప్రముఖు లని తెలియని తెలుగువా రుండరు. వీరిరచనలు మాసాహిత్య లతా గ్రంథమాలయందు ప్రచురింప వలె ననెడి కుతూహలము మాకు చాలకాలమునుండియు కలదు. నేటి కట్టి సదవకాశము లభించినందులకు సంతసించుచు న్నాము. ఆశీర్వాదపూర్వకముగా తమరచనలను మాగ్రంథమాలలో ప్రచురించుట కొసంగిన శాస్త్రి గారికి మాకృతజ్ఞత. సిద్ధహస్తు లగుఈకవి శేఖరులరచనలు చదివి మాపాఠకు లానందింతురు గాక!

కర్లపాలెం కృష్ణ రావు

విశ్వజనీన గ్రంథావళి

సంపాదకుడు: శ్రీ నోరి నరసింహ శాస్త్రి

# పద్మావతీ చరణ
# చారణ చక్రవర్తి

సా హి తీ  స మి తి

రేపల్లె. తెనాలి. గుంటూరు.

రాజమహేంద్రవరము. పిఠాపురము.

మారేడుపల్లి-సికిందరాబాద.

నాంపల్లి-హైదరాబాద (దక్షిణ)

# పద్మావతీ చరణ
# చారణ చక్రవర్తి

పద్య నాటిక

శ్రీ శివశంకర శాస్త్రి

సాహితీ సమితి
నాంపల్లి-హైదరాబాద

అంకితము

భార్యాస్మృతికి

## పాత్రలు

పద్మావతి

జయదేవుడు

పరాశరుడు

లక్ష్మణ సేనుడు

మహేశ్వర భట్టు

వామదేవ దీక్షితులు

నీలకంఠ మఖి

ఉమాపతి

ధోయీ కవి

గోవర్ధనాచార్యులు

గౌడ నగరము:

జయదేవ భవనము

### పద్మావతి

పయన మొనరింప నున్నారు ప్రాణనాథ.
గౌడ లక్ష్మణసేన భూకాంతు సభకు.
అవధరింపగ వలయు కృపార్ద్రమతిని-
ప్రార్థనము చేయనున్న దీ పాదదాసి.

### జయదేవుడు

ఏల యింత జాలి హృదయేశ్వరీ, తెల్పు
మెన్నడే నిరాకరించినావె
నేటివర కీతండు నీవాంఛితంబును ।
వెరగు దోప నిట్లు వేడ నేల?

### పద్మావతి

ఏలనో కాని ప్రాణేశ, ఈదినాన
మానసాబ్జము దోలాయమాన మయ్యె.
వెరపునైతము కలుగు నా విన్నపమ్ము
సఫలతం గాంచ దను మహాసంశయమున.

జయదేవుడు

ప్రార్థనమ్ము మాని ప్రాణేశ్వరీ, నాకు
ఆజ్ఞ యిత్తువేని యచిరముగనె
అనుసరించువాడ నౌదలం దాలిచి:
శంక విడువదగదె యింకనైన?

పద్మావతి

వినగ నెల్లరు గీత గోవిందకృతిని
పాడుదురు మీరు నృపసభా భవనమందు.
కావ్యదోషము లున్న నిష్కారుణముగను
బయలుపెట్టరె పండితప్రవరు లప్పుడు ?

జయదేవుడు

అష్టపదులు చాల అవధరించినవాడు
గోష్ఠిలోన నృపతి కుతుకమునను.
కావ్యపరిసమాప్తి కావుట యాలించి
ప్రభు వొసంగె నాజ్ఞ పఠనమునకు.

అధిపు దర్శనార్థ మరుదెంచి యున్నారు
దాక్షిణాత్య పండిత ప్రకాండు
లీ దినంబు, వార లేతెంత్రు లక్ష్మణ
ప్రభుని సభకు కావ్యపఠనవేళ.

# ప్రథమ రంగము

నిఖిల కళలయందు నిష్ణాతులై మహా
విబుధులైనవారు విన్నయపుడు
కావ్యబంధమందు గలుగు ప్రాశస్త్యంబు
విశద మగును. కవికి యశము నిలుచు.

అవగుణంబు లున్న నాస్థానకవి ప్రతి
గ్రంథమందు ధరణీ కాంతునకును
కీర్తి తరుగు ననుచు గీతగోవిందమ్ము
తరచి చూచినాను తాల్మితోడ.

అంతె కాక శ్రీమదాచార్య గోవర్ధ
నార్య సమ్ముఖమ్మునందు కృతిని-
ఆదినుండి శ్రద్ధ నాలింపగా ఉమా
పతియు, శరణకవియు- పాడినాను.

దోషరహిత మరియె ధోయీ కవీంద్రాది
సమితి యెల్ల, నాకు శాంతి యొసవె.
అతి కుశాగ్రబుద్ధి యౌ పరాశరునకు
కావ్య మయ్యె నపుడె కంఠగతము.

కావ్యశోభకొరకు కావింప దగుమార్పు
లేవి తోచకున్న వింక నాకు.
పరిణతాత్మ యైన పద్మావతీదేవి
భావ మేమొ విశదపరప వలయు.

## పద్మావతి

రస సదన మైన కృతి శరీరమ్మునందు
కానబడుచున్న యది కళంకత్రియమ్ము
ప్రాణనాయక. మన్నించి పాదదాసి
విన్నపము, దాని దొలగించివేయ వలయు.

## జయదేవుడు

నా తలంపునందు నాలుగు దోషముల్:
పదమునందు, వాక్య బంధమందు
అర్థమందు, రసమునందును; వీనిలో
తుదకి యొకటె ప్రబలదోష మబల!

అందుగూడ నెవి రసాది ప్రతీతి ప్ర
కర్షములకు బంధ కారకములో,
సహజముగనె యెవి రసప్రతీతి విలంబ
కారకములొ వాని గడపవలయు.

దోష మున్న దాని దొలగించి వేయుటే
కవికి సముచితంబు, కావ్యమందు
తెలుపగదవె సకల లలిత కళాభిజ్ఞ.
తోచినట్టి ప్రబల దోషములను.

## పద్మావతి

కెరలి పద్మావతీ చరణ చారణ చరి
వర్తి యం చాడనే వైచినారు
స్థానాంతరమ్మున జయతి పద్మావతీ
రమణ యం చేమేమొ వ్రాసినారు

వేరొకతావున విహిత పద్మావతీ
సుఖసమాజే యంచు జొనిపినారు
ఇమ్మాడ్కి నాపేరు ముమ్మారు గీతగో
విందబద్ధమ్ము కావించినారు.

కేవలమ్ము రహస్యంపు గ్రిదలందె
పేర్కొనం దగు నిజభార్యపేరు మీరు
స్వీయకావ్య శరీరాన చేర్చుకతన
గ్రింథమునకు కలంకమ్ము కలుగలేదె ?

## జయదేవుడు

తనివి తీరనే సుధామధురమ్ము నీ
నామధేయ చింతనమ్ము వలన
పద్మ, కావ్యమందు బద్ధంబు చేయుట
వలన దాని కొదవె వైభవంబు.

సకలలోకపూజ్య జగదంబ పేరె సీ
పేరు పద్మ. దాని బేరుకొన్న
రసన మీది రజము రాలిపోవుటె కాక
ఆర్ద్రమయి పవిత్రమగును గాదె!

కవులు కృతులయందు కాంతాభిధానంబు
సంస్మరించుచుంట సరసమె కద!
ఉన్నవారు కొంద రుత్సాహవంతులు
పెట్టినారు భార్యపేరె కృతికి.

పద్మావతి

నిండుసభలోన నేడు నాన్నృత్య విషయ
మవధరించిన పెద్ద లే మందురో కద!
కవుల దృష్టాంతముల్ పెక్కు కలవు నాథ.
కాని బాధించుచున్నది గాఢలజ్జ!

జయదేవుడు

విన్నయపుడు దాన వ్రీడాకరం బైన
దేమి యుండు వార లేవగింప?
నేర్పు కలదు నీకు నృత్యాదికళలలో
నవి గ్రహించి మిగుల నభినుతింతు.

పద్మావతి

మీకు నిజభార్యపై ప్రీతి మేదురముగ
నుండుగాక, మనస్సులో నుంచికొనుట
సముచితం బగు. ఈరీతి జనము మ్రోల
ప్రకటనము చేయ పాడియే ప్రాణనాథ!

జయదేవుడు

అవిదితంబె నీకు కవులు నిరంకుశుల్,
స్వేచ్ఛలోనె వారి జీవనంబు!
ఒరుల కెట్లు సాధ్య మున్మత్త మాతంగ
గమన మాప వారికవితయందు?

పద్మావతి

చాటువాక్కులచే వివశత్వ మొదవు,
అయిన నా తుదివిన్నపం బాలకించి
తెలియనీయక పద్మావతీ సమాఖ్య
జగమునకు, నన్ను రక్షింప దగును నాథ!

జయదేవుడు

చెప్పలేను నేను సిగ్గిల దగుమాట
నామ ముగ్గడించినాను కాని.

నీవు కళలలోన నిష్ణాత వనుకీర్తి
శాశ్వతముగ నిలుచు జగమునందు.

ఓర్మి నీవు నాకు నుత్సాహ మీకున్న
కావ్య మెట్లు చేయ గలుగువాడ?
పద్మ, పద్మ, నాకు ప్రాణేశ్వరివి, మూర్తి
దాల్చి నట్టి యిష్ట దైవతమవు!

పరాశరుడు

(త్వరితముగా ప్రవేశించి)

జాగు చేసెద వేల జయదేవ, యింక?
నీకోస మెల్లరు నిర్నిమేషముగ
ఉత్కంఠతో వేచియున్నవా రదిగో
పట్టభంగశ్రేణి పార్శ్వమ్మునందు.

కవివత్సలుండు లక్ష్మణసేన నృపతి
పంపె నాదరముతో భద్రగజమ్ము.
జాగు చేయుచు రమ్ము. స్తంభేరమమ్ము
నిలిచి యున్నది ద్వారవాటమ్మునందు.

నీహస్తగత మైన నీలకౌశేయ
బద్ధ మనోజ్ఞ ప్రబంధమ్ము సఖుడ,
రాధికాదృఢపరీరంభమం దున్న
గోవిందుపోలిక గోచరించినది.

పద్మావతి

అదిగొ కల్యాణశంసి ఘంటారవమ్ము ।
బయలుదేరుచు నృపసభాభవనమునకు
వరదు డైనట్టి రాధికా వల్లభుకృప.
విజయ మగుగాక గీతగోవిందకృతికి ।

# ద్వితీయ రంగము

## లక్ష్మణసేన మహారాజసభ

మహారాజు

భూసుర పుంగవు, లేత
ద్వాసరమున కావ్యగోష్ఠి తత్పరు లగు మీ
యాసంపూర్తి శ్రవణము
మాసుకృతఫలంబు గాక మరియొం డగునే!

మీరో సమస్తవిద్యా
పారంగతు, లఖిలకావ్య భవ్యసమీక్షా
ధీరులు, సంగీతకళా
పారీణులు, పూత దేవభాషాకవులున్.

కావున మా కెరిగింపం
గావలె విపులముగ కావ్యగానంబులు మీ
కేవిధముగ రుచియించెనో;
కోవిదసమ్మతి యథార్థగుణకమ్ము గదా!

మహేశ్వర భట్టు

చిత్తము మహాప్రభూ, మీ రశేష శేము
షీ ధురంధరులు, రసజ్ఞశేఖరులును.
అట్టి మీసన్నిధానమునందు మేము
వ్యాఖ్య చేయుట కేవల మాజ్ఞవలన.

మేము వినలేదిత:పూర్వ మీమనోజ్ఞ
గీతగోవింద సంగీత రీతు లెపుడు,
తనివి తీరగ గానామృతమ్ము గ్రోల
జ్వరము వాసె పుటాయిత శ్రవణములకు।

కానవచ్చుచు నున్నవి గానకళను
శీఘ్రకాలములో మార్పులెన్నొ యెన్నొ,
అయిన, జయదేవ కవిశేఖరాష్టపదుల
పాట కెపుడు జగత్తులో లోటు రాదు।

## వామదేవ దీక్షితులు

మాళవ, వసంత, దేశవరాళి, గుణక
రీ, గుణక్రియలును, ఘూర్జరీ విభాస
భైరవులును, రామక్రియ పాడినాడు
రక్తకంఠముతో కవిరాజు నేడు

మ్రోగుచున్నది ఘూర్జరీరాగ మింక
మాళవియోయుగళంబున మధురకళల,
కవివరేణ్యుని యద్భుత గానకలన
కావ్యబంధము మధురిమోద్గార మయ్యె!

పద్మావతీ...

నీలకంఠ మఖి

కవులు ప్రాయికముగ గాయకుల్, జయదేవ
కవివరుం డఖండ గాయకుండు.
నేటిగానమునకు నిజముగా గంధర్వు
లైన వివశు లగుట యబ్బురంబె?

కావ్యవిషయ మింక గాదేశ! అన్యథా
యీకవిప్రకాండు డెంచకున్న
వివరములను కొన్ని విద్వద్వినోదార్థ
మడుగ దలతు నాజ్ఞ యయ్యెనేని.

మహారాజు

సమనసుల భాషణంబుల
కమర్ష కవి కేల కలుగు? అగుటన్ సంకో
చము వీడి కావ్య మియ్యెడ
విమర్శ చేయంగ దగును విబుధప్రవరా!

నీలకంఠ మఖి

ఎందు జేర్పవచ్చు నీనవ్యకావ్యంబు?
కాదు నిండురూపకమ్ము గాని.

శ్రవ్యకావ్య మైన సంపూర్ణముగ గాదు,
గేయకృతియు గాదు కేవలముగ.

ఉమాపతి

ఏల చేరవలయు నేశ్రేణిలో నైన?
సూక్ష్మదృష్టితోడ జూచునెడల
ప్రతికవీంద్రరచన ప్రత్యేకమై యుండు,
కూడు నన్నిగతులు కొన్నియెడల.

ఏగుణంబు మిగుల హెచ్చుగా గాన్పించు
చుండు దానివలన నొదవు నాఖ్య
యెట్టికృతికినైన; ఈమహాకావ్యంబు
నందు గేయగుణము తుందిలంబు.

నీలకంఠ మఖి

వినుతి కెక్కినారు వెనుకటి కవివరుల్
వేలకొలది పద్యవితతితోడ
సర్గబంధములను సంఘటించి యుదాత్త
వసు కథన గౌరవంబు మీర.

ఇందు గేయసంఖ్య యిరువదినాలుగు,
పదియు కొదువ నూరుపద్యశతములకు.
ఇట్టి గ్రంథమునకు నేవిధంబుగ మహా
కావ్యసంజ్ఞ నీయగలమొ చెపుడి!

శరణు మిశ్రుడు

గ్రంథబాహుళ్యమే మహాకావ్యమునకు
కాదు లక్షణ, మధురుడ కవిభవతంసు
పద్య మొక్కటి నూరుప్రబంధములకు
సాటి యని విశ్రుతము కాదె సరససూక్తి?

వామదేవ దీక్షితులు

శ్రీమదాచార్య దండి శాసించినాడు
సర్గబంధమునందు అష్టాదశ మిత
వర్ణన విధానములు చూపవలయు ననుచు:
కలవె యన్ని యేతద్గీతి కావ్యమందు?

శరణు మిశ్రుడు

సంఖ్య కష్టాదశమ్ముగా సంతరింప
గ్రంథమున వర్ణనలు మహాకావ్య మగునె?

వామదేవ దీక్షితులు

వృత్తములు గేయములకన్న నుత్తమమ్ము
లనెడి ఛందోవిదాళియ మఖిలవిబుధ
సమ్మతం, బిందు గీతికాసరణి యుంచు
కితన న్యూనత కలుగదె కావ్యమునకు?

ఫోయీా కవి

శ్రవణసౌఖ్యమె లక్ష్యము ఛందమునకు;
చదువవచ్చును పద్యాలసరణి వీని
పద్యమునకైన గీతికా పదముకైన
రాగతాళాలవరుసను రక్తి మెండు.

వామదేవ దీక్షితులు

ఒకట శార్దూల విక్రీడి తోక తోడ
అవల నొకదాన పుష్పితాగ్రాహ్వయమున
పృథ్వి యని యింక నొక్కచో పేరు చొనిపె
వృత్తములయందు; అర్థాన వెలితి రాదె?

ఉమా పతి

పరికరణార్థమునకు ఛంగంబు గూర్చి త
త్పదములే పరిధానతను వహింప

అనుట తగును దోష మ౯: చమత్కారంబె
ప్రతిఫలించె మూడు పద్యములను.

వామదేవ దీక్షితులు

అతిమధుర మైనశబ్దవిన్యాస కలన
సారెసారె కలంకార చతురిమమున
పదశరీరముపై నిల్పి భావగరిమ
గనుగొనగ నీదు బుద్ధి నీకావ్యరచన.

ధోయీ కవి

మాటలను రీతులందును మధురిమంబు
ద్యోతితం బైన, శోభకే హేతు వగును.
అధమ మగు శబ్దచిత్రమే యైనకావ్య
మిందు నీషదలంకృతియే యెసంగు.

మహేశ్వర భట్టు

వివిధవిధముల గీతగోవిందమందు
కడు విశృంఖలరీతి నిక నీవరుండు
రతిని వర్ణించుకతమున రక్తి హెచ్చ
దే పతనపాతనమ్ముల దేహమునయి?

గోవర్ధనాచార్యులు

ఇందుల కవి రాధా గో
విందులలీలలను భక్తివివశుండై యా
నందంబున మకరంద
స్యందివచోగుంఫనముల నభివర్ణించెన్.

జనియింపవచ్చు నొకచో
మనుష్యరతివర్ణనమున మదిని వికారం,
బనఘమతి దివ్యచరితము
వినంగ నేలాగు కల్గు వికృతి మహాత్మా!

రసికవరివరుల కెల్లన్
రసాపకర్షకము కాదు రతివర్ణన; మీ
యశదృశకృతి దాత్పర్యం
బెసంగు జీవేశ్వరైక్యమే తలపోయన్.

ఎరుక గలవార లందురు
శరీర మాద్యమ్ము ధర్మసాధన మని: త
ద్వరవాక్యంబును మెచ్చని
విరాగులకు దేహ మన్న వినుగు కవీశా!

మీరు వినోదార్థముగా
నేరిన దోషములె కాక యితరము లెన్నో

ఆరోపింపగ జాలుదు
రూరక, నిజదృష్టిదోష మున్న జనంబుల్.

మహేశ్వర భట్టు

భక్తులకు రసికవరులకు పండితులకు
కవిజనంబుల కిది మహాకావ్య మగును.

మహారాజు

మణిహారమును పుష్పమాలికం జుట్టి
గ్రంథరాజము భద్రగజముపై నుంచి
వివిధ వాద్యములదో వీథులవెంట
వైభవమ్ముగ నుత్సవము చేయవలయు.

శిల్పిచే జెక్కించి శ్రీ జయదేవ
కవిరాజ నామమ్ము గారుత్మకాశ్మ
ఫలక భాగమున భద్రాక్షరముల,
జాలమార్గముకడ సంధింపవలయు.

కవిరాజ భార్యకు గౌరవార్థముగ
అర్పించినార మీ యాభరణాలు.
ఒసగినారము తటి న్యుద్యానవాటి
బిందుబిల్వం బను పేరిట కవికి.

తగు బిరుదంబుగా తన భాషితంబె
మన కవీంద్రునకు: పద్మావతీచరణ
చక్రవర్తిగ సభాస్తారు చెల్లడును
అంగీకరింతురు గా కైక కంఠ్యముగ।

( సభ్యుల హర్ష ధ్వనులు )

మహేశ్వర భట్టు

దేవ, మీ కవుల్ విక్రమాదిత్య భోజ
ధరణి పాస్థానకవులకు తగ్గిపోరు.

మహా రాజు

వాచ: పల్లవ త్యమాపతిధరి,
స్సందర్భ శుద్ధిం గిరాం
జానీతే జయదేవ ఏవ, శరణ:
శ్లాఘ్యో దురూహద్రుతే:

శృంగారోత్తర సత్ప్రమేయ రచనై
రాచార్య గోవర్దన
స్పర్ధీ కోపి న విశ్రుత:, శ్రుతిధరో
ధోయీ కవిక్ష్మాపతి:.

